SREE VAGVALLI SERIES No: 13.

# Sree Ramachandra Satakam

By

Sreemati Bala Tripurasundaryamba.

Edited By

K. V. RAMANUJA CHARYULU.

SREE VAGVALLI SERIES No. 13.

# శ్రీ రామచంద్రశతకము.



ఇది—

శ్రీ బాలా త్రిపురసుందర్యంబా

ప్రణీతము.

శ్రీ తల్పగిరి మాహాత్మ్యాది గ్రంథకర్తయు,
నెల్లూరు శ్రీవెంకటగిరి మహారాజాగారి కాలేజీ
ఆంధ్ర సహాయోపాధ్యాయులును,
శ్రీ వాగ్వల్లి పత్రికాధిపులునగు;
శ్రీమాన్ కొమాండూరు వెంకట రామానుజాచార్యులచే

ప్రకటితము.

నెల్లూరు. ప్రభాతముద్రణాలయమున ముద్రితము.

 ధాతృ-మాసము [0—8—0

Vol. IV. No. 13.



శ్రీమాన్ కొమాండూరు వెం॥ రామానుజాచార్యులుగారు.

# కృతిప్రశంస

ఈ రామచంద్ర శతకమును విరచించిన చి॥ సౌ॥ శ్రీ
బాలాత్రిపురసుందరీదేవిగారు గుంటూరు నగర వాస్తవ్యులు.
పరాభవ సం॥ రం॥ శ్రావణ బ ౧౧ లు బుధవారమునకు సరి
యగు హూణశకము 1906 ఆగష్టునెల తే 15 ది జననమందిరి.
జననియగు శ్రీమతి నాగమణ్యాంబగారి యొద్ద సంగీతసాహిత్యా
ది విద్యల నేర్చిరి. భక్తిపరవశయై భగవంతునిగూర్చి వందల
కొలఁదికీర్తనలు విరచించిరి. వీరు ప్రస్తుతము నెల్లూరు తాలూకా
తహశీలుదారుగారైన మ. రా. శ్రీ దాసరి శ్రీరాములునా
యుడిగారి ధర్మపత్నియై యున్నారు. వీరియిష్టదైవము రామ
చంద్రుండగుటఁ దనకుఁ బ్రత్యక్షదైవమగు భర్త నామమును
శ్రీరామచంద్రుని స్మరణంబున నధ్యవసించి యీపతిప్రాణ
రకార ప్రాస శ్రీరామ కందశతక మొకటియు రామచంద్ర
శతక మొకటియు రచించిరని తోఁచెడిని. ఈసాధ్వి మృదుపద
లలిత భక్తిభావవిలసనంబగు వాక్కుసుమంబుల శ్రీరామ
చంద్రుని బూజించినటుల స్ఫురించెడిని. మఱియు నీకవయిత్రి
పతివ్రతాప్రభావంబులు భక్తిరస పూరితంబులు పతిసేవావి
ధాన ద్యోతకంబులునగు పద్యగద్యాత్మక పలుకబ్బంబుల
విరచించినటులఁ దెలియుచున్నది. ఇట్టి వీరికష్టైశ్వర్యంబులొసంగి
మనుచిదయామయుండగు నీశ్వరు నిరతము వేఁడువాఁడ.

# పంచరత్నములు.

---

చ. ఆరయ సుసాధ్వియౌటఁగడు • నబ్బుర మందు వివేక మొప్ప వా
ర్వరత నెసంగికబ్బముల • వ్రాయుటసంస్తవనీయ మందు నన్
సరసమృదూక్తిఁజెందుట భృ • శమ్ముప్రశస్తమ యందు రామ
సంస్మరణకృతుల్ రచించుట ని • జంబుగఁబ్రాగ్భవపుణ్యమేకదా॥ 1

తే-గీ. మొల్ల తరిగొండవేంకమ • మోహనాంగి
ముద్దుపళని కృతుల్ సేసి • ముదితలందు
యశముఁగాంచినయట్లు స • ద్యశము మెఱయ
మనుము శతవత్సరంబులు • మహితలమున॥ 2

చ, సరసుండార్తజనాదరుండు సుజన • శ్లాఘైకపాత్రుండు స
చ్చరితోద్యోగమహోన్నతుండు సుయశ • స్సంపన్నుఁ డుద్యత్కళా
పరిపూర్ణుండు గుణాలవాలుఁడు మహా • భాగుండునై యొప్పు దా
సరిశ్రీరామునిఁ దత్సతిన్ మనుచు న • శ్రాంతంబుఁ శ్రీరాముఁడున్॥

కొమాండూరు వేంకటరామానుజాచార్యులు.

క. అనుపమ భక్తిమరందం
బునుజిప్పిలుహృద్యపద్య • పుష్పంబులరా
మునిబూజించితివౌ పే
ర్మిని బాలాత్రిపురసుంద • రీ కవయిత్రీ 1

క. అంబుజహిత శశి నక్ష
త్రంబులు చరియించునంత • దాకను నీ క
బ్బంబులు ధైవారుత ధా
త్రిం బాలాత్రిపురసుంద • రీ కవయిత్రీ॥ 2

వదాల— రామమూర్తి, అష్టావధాని,

శ్రీరస్తు-శుభమస్తు

# శ్రీరామచంద్ర శతకము.

శ్రీరమణీలోల ♦ శ్రీరమ్యగుణశీల
శ్రితజన పరిపాల ♦ శ్రీనివాస
జలధిమధ్యమునందు ♦ శయనించినాఁడవు
జయభక్త పరిపాల ♦ శరణుశరణు
నగరాజ సమధీర ♦ నవమోహనాకార
నానేరమెంచకు ♦ నాగశయన
మరకత మాణిక్య ♦ మణివేదికలయందు
వేంచేసియుండెడి ♦ వేదవేద్య

తే. గీ. జలజదళనేత్ర నీపాద ♦ జలజములకు
వందనమొనర్తు నీ కర ♦ విందనయన
పుణ్యగుణధామ రవికులాం ♦ బోధిసోమ
రమ్యకరుణాతిసాంద్ర శ్రీ ♦ రామచంద్ర. 1

సీ! శ్రీజానకీరామ ♦ శ్రితజనమందార
నీకు మ్రొక్కెదనయ్య ♦ నీరజాక్ష
సదమలభక్తితో ♦ సతతము నిన్గొల్వ
సకలబాధలుదీరు ♦ సదయహృదయా
నిఖిలజీవంబుల ♦ నిరతంబు గాపాడు
సరసగుణాకర ♦ సత్యచరిత
జలజబాణునిగన్న ♦ జయరఘుకులవీర
నీదయఁజూపవే ♦ నిర్మలాత్మ

తే.గీ. వనజసంభవవందిత ♦ వనజనాభ
కరిని గాచినరీతి నన్ ♦ గావవయ్య॥ పుణ్య ... 2

సీ. శ్రీరమావల్లభ ♦ శ్రీ రామభూపాల
శృంగారగుణశీల ♦ శ్రీనివాస
ఎన్ని నేరములున్న ♦ విన్నపమాలించి
సన్నుతుల్ గొనుమయ్య ♦ సదయహృదయ
తులసికాదామ నిన్ ♦ తులసీదళంబుల
నిరతముపూజింతు ♦ నిర్మలాత్మ,
గంభీరమృదుభాష ♦ కంజాతహిత వంశ
కలశాంబునిధి చంద్ర ♦ కరుణఁజూపు

తే. గీ. మయ్య నీలోత్పలశ్యామ ♦ యబ్జనాభ
వందనంబిదెగొనుమయ్య ♦ వారిజాక్ష॥ పుణ్య...3

సీ. శరణుపద్మదళాక్ష ♦ శరణుమృదు సుభాష
శరణుసీతాధిప ♦ శరణుశరణు
శరణు మోహనరూప ♦ శరణుదీనదయాళు
శరణు శ్రీరఘువీర ♦ శరణుశరణు
శరణుకాంచనచేల ♦ శరణు లోకాధీశ
శరణుశ్రీధర హరి ♦ శరణుశరణు
శరణుసురసుసేవ్య ♦ శరణుదైత్యవిపక్ష
శరణుదయామయ ♦ శరణుశరణు

తే. గీ. శరణుదశరథవరపుత్రి ♦ శరణుశరణు
శరణుపతితపావననామ ♦ శరణుశరణు॥ పుణ్య... 4

సీ, కారుణ్యమూర్తివై ♦ కలుషంబుల నడంచు
పతితపావన నీకు ♦ వందనంబు
ప్రత్యక్షదైవమై ♦ భవబంధములఁబాపు
వరగుణాకరనీకు ♦ వందనంబు
భవ్యస్వరూపుఁడై ♦ ప్రజలరక్షించు నీ
పాదపద్మములకు ♦ వందనంబు
ఆర్తరక్షకుఁడవై ♦ యాపదల్ ఖండించు
పద్మాక్ష నీకిదె ♦ వందనంబు

తే, గీ. పాపభంజన నీకిదె ♦ వందనంబు
భక్తపోషక నీకిదె ♦ వందనంబు॥ పుణ్య...... 5

సీ. కల్యాణమూర్తివై ♦ కాంక్షితార్థములిచ్చు
మారజనకనీకు ♦ మంగళంబు
కల్పవృక్షంబవై ♦ కరుణతో మముఁబ్రోచు
మానివంద్యానీకు ♦ మంగళంబు
శరణన్నవారిని ♦ సరసతఁబ్రోచెడి
మానితగుణసాంద్ర ♦ మంగళంబు
దేవదేవోత్తమ ♦ దేవేంద్రవందిత
మణిమయాంచితహార ♦ మంగళంబు
తే. గీ. మారశతకోటి సుకుమార ♦ మంగళంబు
మదన·మదహరవందిత ♦ మంగళంబు॥ పుణ్య...6

సీ. పరమపావనియగు ♦ భాగీరథినిగన్న
యవ్యయానంద జో ♦ హారునీకు
నపరంజి విరులచే ♦ నతిభక్తిఁ బూజింతు
యాజివర పుత్రి జో ♦ హారునీకు
పాల మున్నీటిపైఁ ♦ బవళించు నబ్ధిక
న్యామనః ప్రియుఁడ జో ♦ హారునీకు
భక్తసంతతిఁబ్రోచు ♦ భక్తలోకారాధ్య
యమలగుణాఢ్య జో ♦ హారు నీకు
తే. గీ. అంబుజాసనవినుత జో ♦ హారునీకు
అవనిజా మనోనాథ జో ♦ హారునీకు॥ పుణ్య... 7

సీ. జయపుండరీకాక్ష ♦ జయభక్తపరిపాల
జయయిందిరాలోల ♦ జయశరణ్య
జయదంతిరక్షక ♦ జయమోహనాకార
జయపాపభంజన ♦ జయశరణ్య
జయసాధుమందార ♦ జయకాంచనాంబర
జయరమ్యగుణశీల ♦ జయశరణ్య
జయరామభూపాల ♦ జయసురపరిపాల
జయమోక్షదాయక ♦ జయశరణ్య
తే. గీ. జయసురసుసేవ్యసువిచార ♦ జయశరణ్య
జయదయారసపరిపూర్ణ ♦ జయశరణ్య॥ పుణ్య ...8

సీ. జయజయరఘురామ ♦ జయజయగుణధామ
జయజయ రిపు భీమ ♦ జయనమోస్తు
జయజయరఘువీర ♦ జయజయ సువిచార
జయజయమునిలోల ♦ జయనమోస్తు
జయజయరఘునాథ ♦ జయజయసుకుమార
జయజయపరమాత్మ ♦ జయనమోస్తు
జయజయవనజాక్ష ♦ జయజయసురరక్ష
జయజయశ్రీరామ ♦ జయనమోస్తు
తే. గీ. జయజయ జనకజాధిప ♦ జయనమోస్తు
జయజయపరమపూరుష♦జయనమోస్తు॥ పుణ్య...9

# శ్రీ వాగ్వల్లి

సీ. దీనుల యాపదల్ ♦ దీర్పంగ సమకట్టి
యిక్ష్వాకుకులమున ♦ నింపుతోడ
జన్మించినట్టియో ♦ జలజాతలోచన
ననుధన్యుఁజేయవే ♦ వినుతచరిత
పరమాత్మ నిరతంబు ♦ భజియింతునతిభక్తి
నీపాదపద్మముల్ ♦ నెమ్మితోడ
భక్తహృదయపద్మ ♦ భవ్యపీఠమునందు
నివసించియుండువు ♦ నీలవర్ణ

గీ. నీదుమాయలఁ దెలియఁగ ♦ నేరితరము
సకల లోకేశ జోహారు♦సదయహృదయ॥పుణ్య...10

సీ. తాపసమందార ♦ తాటకిమర్దించి
గాధేయుజన్నంబుఁ ♦ గాచినావు
పతిశాపవశమున ♦ గతిలేకపడియున్న
గౌతమకాంతను ♦ గాచినావు
అమరులుసుమవృష్టి ♦ తమపై నిగుడియింప
శివధనుర్భగంబు ♦ సేసినావు
కమలసంభవ హార ♦ కౌశికమునిమెచ్చ
యవనిజాతను బెండ్లి ♦ యాడినావు

గీ. ధర్మమార్గంబు సతతంబుఁ ♦ దాల్చినావు
దుష్టరాక్షసవర్గంబుఁ ♦ దునిమినావు॥ పుణ్య... 11

సీ. పరమదయాసాంద్ర ♦ పతితపావననామ
పరశురామునిభంగ ♦ పఱచినావు
అన్నవస్త్రములేక ♦ యల్లాడుచుండెడి
దీనులయాపదల్ ♦ దీర్చినావు
వేదసాదలటంచు ♦ భేదమించుకలేక
శరణన్నవారిని ♦ జాకినావు
రామభద్రుండెమాకు ♦ రాజుగావలెనని
ప్రజలచే సత్కీర్తిఁ ♦ బడసినావు
గీ. శస్త్రవిద్యను నిపుణతఁ ♦ జాటినావు
గాధితనయుని మన్ననల్ ♦ గాంచినావు॥ పుణ్య 12

సీ. కాంచన మణిమయ ♦ కర్ణకుండలకాంతి
గండభాగంబులఁ ♦ గడలుకొనఁగ
మహనీయకంకణ ♦ మణిమయహారముల్
తళతళయురమునఁ ♦ దళుకుమనఁగ
సురగరుడోరగ ♦ వరకిన్నరవరులు
నతిభక్తి నీకు జో ♦ హారులిడఁగ
కమనీయరత్న కం ♦ కణములు కరమున
ఘులుఘల్లుమని తాళ ♦ గతులుచెలఁగ
గీ. నభయమిచ్చి రక్షింపు మా ♦ యయ్యనీవు
పరమభక్తులఁబోషింపు ♦ భవ్యమూర్తి॥ పుణ్య 13

సీ. మరకత మాణిక్య ♦ మణికిరీటముతోడ
మణిముద్రికావన ♦ మాలతోడ
రత్నకుండలభాసు ♦ రకపోలములతోడ
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీలతోడ
విశ్వరూపంబైన ♦ విమలరూపముతోడ
వికసితపుష్పమా ♦ లికలతోడ
జిగిమించుబంగారు ♦ జిలుగుదుప్పటితోడ
రమణీయరత్నహా ♦ రములతోడ

గీ. గరుడ గంధర్వ కిన్నర ♦ గణముతోడ
వచ్చి యభయంబు వేవేగ ♦ నిచ్చిపోవు॥ పుణ్య 14

సీ. తెలితమ్మివిరులను ♦ దెగడుకన్నులతోడ
దివ్యవిభూషణ ♦ దీప్తితోడ
నీలమేఘశ్యామ ♦ లాలితద్యుతితోడ
కౌస్తుభమణి వత ♦ కంబుతోడ
వనరుహామాలికా ♦ వక్షంబుతోడను
నవరత్నమయభూష ♦ ణములతోడ
కమనీయకాంచన ♦ కంకణములతోడ
పలనొప్పుపచ్చని ♦ వలువతోడ

గీ. చుట్టుఁజెలువలుగొలువఁగ ♦ సొంపుతోడ
రారపుడమితనయగూడి ♦ రామభద్ర॥ పుణ్య 15

సీ. దశరథవరపుత్ర ♦ తండ్రిల మరపించి
తండ్రిగాదయజూపి ♦ ధరణిజనులఁ
బ్రోచితి కడుదయఁ ♦ బుణ్యగుణాకర
నీదయఁ జూపవే ♦ నిఖిలవంద్య
సరసిజదళనేత్ర ♦ సదమల చారిత్ర
చారుసుందరగాత్ర ♦ సదయహృదయ
మరకత హారనీల ♦ మణిమఁటపాసన
యెంతని వేఁడుదు ♦ కంతుజనక
గీ. పతితపావనబిరుద మి ♦ ప్పటిడఁగాదు
పరమపురుష పరాత్పర ♦ భవవిదూర॥ పుణ్య 16

సీ. నీలోత్పలశ్యామ ♦ నీరూపుఁజూపవే
నిర్మలమణిహార ♦ నీరజాక్ష
విన్నవించెదనాదు ♦ విన్నపమాలింపు
విశ్వమోహనరూప ♦ విమలచరిత
భక్తజనావన ♦ భవ్యకాంచనమణి
భూషణంబులఁదాల్చి ♦ బ్రోవరార
జలజాప్తకులవంశ ♦ జలనిధిసోమ సు
గుణధామ దయఁజూపు ♦ కువలయేశ
గీ. దాసజనులను బ్రోచెడి ♦ దాతవనుచు
నీదు మరుగుఁజొచ్చితిరామ ♦ నిర్వికార॥ పుణ్య 17

సీ. మహితపల్లవపుష్ప ♦ మాలికల్‌దాల్చిన
మహిసుతాధిపనన్ను ♦ మరువకయ్య
విమలాంబుదశ్యామ ♦ విమలగుణోద్ధామ
విమలాత్మనామొర ♦ వినగదయ్య
భానుకులోద్భవ ♦ భక్తశరణ్య నీ
భక్తులఁబ్రోవఁగా ♦ భారమయ్య
కామితప్రదశీల ♦ కరిరాజపరిపాల
కరినిగాచినరీతిఁ ♦ గావుమయ్య

గీ. ఎల్లవేళలనినుఁబూజఁ ♦ జేతుసయ్య
సర్వజీవాత్మకఁబ్రోవ ♦ సమయమయ్య॥పుణ్య 18

సీ. మునిజనపరిపాల ♦ మునికోటిగొలువఁగ
ముద్దుమోమిటు చూపు ♦ ముదముతోడ
సుమశరశతకోటి ♦ సుందరరూప యో
సీతామనోహర ♦ శ్రీనివాస
సర్వలోకాధార ♦ సజ్జనమందార
నినుమదినమ్మితి ♦ నిగమ వినుత
పద్మవిలోచన ♦ పద్మబాంధవవంశ
కలశాంబునిధిచంద్ర ♦ కరుణఁజూడు

గీ. క్షీరసాగరశయన సు ♦ వీరశరణు
భక్తవత్సలనీపద ♦ భక్తియొసఁగు॥ పుణ్య... 19

సీ. ఎవ్వనిపదసేవ ♦ లేపొద్దుగావింప
నఖిలకళ్యాణంబు ♦ లమరుచుండు
ఎవ్వనికథలు క ♦ ర్ణేంద్రియంబులు సోఁక
సకలపాపంబులు ♦ సమసిపోవు
ఎవ్వనిచరితము ♦ లింపుతోఁబాడిన
సంతాపముల్ వోయి ♦ శాంతిగలుగు
ఎవ్వనినామంబు ♦ నేమరక జపింప
మోక్షంబుగల్గునా ♦ మోక్షరూప
గీ. అట్టినిన్బ్రజగావింతు ♦ నబ్ధిశయన
పరమ పురుష పరాత్పర ♦ పలుక వేల॥పుణ్య... 20

సీ. జానకీరమణ నీ ♦ చరణసేవనుజేయు
భక్తుండు సేయునే ♦ పరులసేవ
సతతంబుమిమ్మ్మల ♦ సన్నుతించెడిజిహ్వ
పరులఁగీర్తించునే ♦ పరమపురుష
నీపాదపద్మముల్ ♦ నిరతంబుఁ బూజించు
చేతులుసేయునే ♦ చెనటిసేవ
నిరతంబునాత్మలో ♦ నినుగాంచు కన్నులు
చూచునే యొరులను ♦ సుందరాంగ
గీ. సకల జగములు మాయగా ♦ స్వాంతమందు
దలఁచి నినువేఁడుచుంటిని ♦ దనుజదమన॥ పుణ్య 21

సీ, తరణికులేశ నీ ♦ చరణసేవకులను
మరచుటన్యాయమా ♦ మదనజనక
వనజదళాక్షనీ ♦ వదనారవిందము
వేవేగఁజూపవే ♦ వేదవేద్య
తులసికాదామ ని ♦ న్దులసీదళంబుల
చేఁబూజఁజేసెద ♦ చెన్నుమీఱ
సాక్షాత్కరింపుము ♦ సనకాదిమునిలోల
జానకీనాయక ♦ జలజనాభ
గీ. నాదువిన్నపమాలింపు ♦ నలిననేత్ర
నీదుసన్నిధిఁజేరితి ♦ నిగమవినుత॥ పుణ్య... 22

సీ. పాలుమీఁగడమంచి ♦ పంచదారయుఁదేనె
నారగింపఁగరార ♦ యమరవంద్య
పచ్చిద్రాక్షయుపన్స ♦ పంచకజ్జాయముల్
నారగింపఁగరార ♦ యమలచరిత
గజనిమ్మ ఖర్జూర ♦ కమలాఫలంబులు
నారగింపఁగరార ♦ యబ్ధిశయన
మామిడిదానిమ్మ ♦ మధురసాన్నములను
నారగింపఁగరార ♦ యవనినాధ
గీ. పంటతోయ్యాలి సుతనీదు ♦ ప్రక్కనుండ
వచ్చియారగింపుము వేగ ♦ వనజనాభ॥ పుణ్యా...23

సీ. నీదుపూజలుఁచేయ ♦ నేదేవుఁగొల్చిరి
యిక్ష్వాకువంశజు ♦ లిచ్చతోడ
నీదు పేరియసిగాఁగ ♦ నేదేవుఁబూజించె
నవనితనూభవ ♦ యబ్జనేత్ర
ఈపుజామాత్రగా ♦ నేదేవుఁ బూజించె
జనకరాజేందు్రిండు ♦ జలజనాభ
ఈజగంబుసృజింప ♦ నేదేవుఁబూజించె
నీరజగర్భుండు ♦ నెమ్మనమున

గీ. అట్టిదేవాదిదేవుని ♦ యంతరంగ
మందు నతిభక్తిఁబూజింతు ♦ నమరవంద్య॥ పుణ్యా 24

సీ. శుకపికశారికా ♦ సుమనోహరంబునై
వలనొప్పునుద్యాన ♦ వనములందు
సహకారపున్నాగ ♦ చందనమందార
చాంపేయతరులతా ♦ ఛాయలందు
నల్లిబిల్లిగనల్లి ♦ వెల్లివిరిసినట్టి
గొజ్జంగిపూవుల ♦ గుబురులందు
సరయూనదీతీర ♦ సౌవర్ణవాలుకా
చారులీలాశైల ♦ సమితియందు

తే. గీ. అవనిసుతగూడివిహరించు ♦ నంబుజాక్ష
నీలనీరదసంకాశ ♦ నిర్మలాత్మ॥ పుణ్యా... 25

సీ. రమణీయ మహనీయ ♦ రత్నశోభితమైన
రంగారు మణిమంది ♦ రములయందు
నవరత్నఖచితమై ♦ యలరారుచుండెడి
యపరంజితూఁగుటు ♦ య్యాలలయందు
వెన్నెలసరితూఁగు ♦ వెన్నెలరాలచే
వన్నెగుల్కెడిబలు ♦ తిన్నెలందు
మహనీయతపనీయ ♦ మణిమయాంచితమైన
చంద్రకాంతోపల ♦ శాలలందు
తే. గీ. పుడమి సుతఁగూడి విహరించు ♦ పురుషసింహ
నీదు సన్నిధిఁజేరితి ♦ నీలవర్ణ॥ పుణ్య...... 26

సీ. వరకౌస్తుభమునీదు ♦ వక్షమందువసింపఁ
దపమేమిసేసెనో ♦ ధన్యచరిత
నై జయంతీమాల ♦ వక్షమందువసింపఁ
దపమేమిసేసెనో ♦ తరళనయన
యురమున శ్రీదేవి ♦ నిరతమువసియింపఁ
దపమేమిసేసెనో ♦ దనుజదమన
వరశంఖచక్రముల్ ♦ కరమందువసియింపఁ
దపమేమిసేసెనో ♦ ధర్మమూర్తి
తే. గీ. నీవు శయనించు సెజ్జగా ♦ నెగడ నురగ
విభుఁడు తపమేమిసేసెనో ♦ వేదవేద్య॥ పుణ్య...27

సీ. మాధవ గోవింద ♦ మధుసూదన ముకుంద
శ్రీధర కేశవ ♦ శ్రీనివాస
హరివాసుదేవ జ ♦ నార్దన యచ్యుత
పురుషోత్తమ యుపేంద్ర ♦ పుణ్యచరిత
భక్తజనావన ♦ భవ్యకాంచనమణి
భూషణంబులుదాల్చి ♦ ప్రోవరార
భవబంధమోచన ♦ తవ చరణసరోజ
ముల్ మదినమ్మితి ♦ ముక్తికొఱకు

తే. గీ, నీల నీలాంబుదశ్యామ ♦ నిర్విచార
జనకజా రమణకమల ♦ చరణ శరణు॥ పుణ్యా...28

సీ. జగధీశనీదగు ♦ చల్లని చూడ్కులు
పఱపి సర్వ బ్రోవుము ♦ పద్మ నయన
మరకతమాణిక్య ♦ మణి మయ సౌధ భా
గంబుల విహరించు ♦ కమలచరణ
కమలాప్తవంశజ ♦ విమలాంబుదశ్యామ
విశ్వమోహనరూప ♦ వినుతచరిత
ప్రోవవే ననువేగ ♦ భోగిభూషణ నుత
నీనామ మంత్రింబు ♦ నిశ్చలమతి

తే. గీ. తోడఁబఠియింతునే వేళఁ ♦ దోయజాక్ష
ప్రాణికోటుల రక్షించు ♦ భవ్యశీల॥ పుణ్యా... 29

సీ. నాపాపములఁ బాపు ♦ నాపుణ్యరాశి వర
గన్నతండ్రివి నీవే ♦ ఖండితముగ
సర్వజనశరణ్య ♦ సర్వాంతరూపక
సీతామనోహర ♦ శ్రీనివాస
నీవెదిక్కని నేను ♦ నెరనమ్మియుండఁగా
నీదయఁజూపవు ♦ నీలదేహ
రాజీవనేత్రనీ ♦ రమ్యపదాబ్జముల్
భక్తితో సేవింతు ♦ పరమపురుష
తే. గీ. పద్మనాభ పరాత్పర ♦ పంకజాత
భవ హర సురేంద్ర వందిత ♦ పాదశరణు॥ పుణ్య 30

సీ. జడదారులనుగావ ♦ జడలను ధరియించి
మణికిరీటముఁదాల్ప ♦ మానినావు
హరిచందనమ్మున ♦ నలరెడు నీమేన
భస్మలేపనఁ దాల్పఁ ♦ బఱగినావు
జిగిమించుబంగారు ♦ జిలుగుదుప్పటిమాని
ఘన వల్కలములను ♦ గట్టినావు
రమణీయరత్నహా ♦ రంబుల దిగనాడి
దండకమండలు ♦ దాల్చినావు
తే. గీ. తల్లిదండ్రుల భక్తిని ♦ దనిపినావు
ఎట్టివారలనైనఁ జే ♦ పట్టినావు॥ పుణ్య... 31

సీ. చతురర్ణవపరీత ♦ సామ్రాజ్యమును వేఁడి
విపినాంతరములకు ♦ వెళ్ళినావు
మరకతమాణిక్య ♦ మణితల్పములమాని
పండుటాకులపైనిఁ ♦ బండినావు
నవ్యరత్నాభర ♦ ణంబులుమాని మం
దారమాలికలను ♦ దాల్చినావు
తమవారివిడనాడి ♦ తపసులతోఁగూడి
వనమృగంబులతోడఁ ♦ దనరినావు
తే. గీ. పరమమునికోటి నెల్లగాఁ ♦ బాడినావు
మిత్రవంశమునందు జ ♦ న్మించినావు॥ పుణ్య...32

సీ. పరమపావనుఁడంచు ♦ సురనదిదాటించె
గుహుఁడెంతధన్యుఁడో ♦ కువలయేశ
కరుణాస్వరూప నీ ♦ కన్న నాకిఁకవేరె
దిక్కెవ్వరున్నారు ♦ దీనపోష
వాసుదేవుఁడనిన్ను ♦ వసుధేశుఁడనుచును
నెప్పుడుధ్యానింతు ♦ నిందిరేశ
దర్శనంబొసఁగి నన్ ♦ ధన్యుజేయవే
మానితగుణసాంద్ర ♦ మదనజనక
తే. గీ. నలినదళనేత్రనిన్నునే ♦ నమ్మినాను
పాపభంజనజనకజా ♦ ప్రాణనాథ॥ పుణ్య ...33

సీ. ముల్లోకములకెల్ల ♦ ముఖ్యుఁడవౌ నీవు
కరుణనేలుచునుండఁ ♦ గొరఁతయేల
తల్లితండ్రివి నీవు ♦ తనయులఁబోషింపఁ
బరుల సేవలఁజేసి ♦ బ్రతుక నేల
యీమాయ దేహంబు ♦ నిలశాశ్వతంబని
మోహసాగరమందు ♦ మునఁగనేల
దీనులఁబోషించు ♦ దేవదేవుఁడవని
పలుమారుపిలచినఁ ♦ బలుక వేల

తే. గీ. కువలయాదళాక్షనీకింత ♦ కోపమేల
వనజసంభవ నుత రార ♦ వనజనాభ॥ పుణ్య... 34

సీ. కమలాక్ష నీపద ♦ కమలముల్ సన్నుతి
కరుణింపవే నన్ను ♦ కమలనాభ
కోదండపాణి నిన్ ♦ గోరి భజించెదఁ
గోటిమన్మథరూప ♦ కోపమేల
పుట్టింపఁ బోషింపఁ ♦ బుణ్యుఁడ వీవుండఁ
బరులచే దెప్పిళ్లు _ పడఁగనేల
పాపపునీవేఁడని ♦ ప్రార్థించు చుండఁగాఁ
బ్రోవఁగా జాగేల ♦ పుణ్యశీల

తే. గీ. ఎంతవేడిన దయరాదు ♦ పంతమేల
భవ్యచారిత్ర జోహారు ♦ పరమపురుష॥ పుణ్య 35

సీ. నీలనీరదనీల ♦ నీరజదళనేత్ర
విశ్వమోహనరూప ♦ విమలచరిత
నిఖిలలోకాధార ♦ నిరుపమగంభీర
రమణీయమృదుభాష ♦ రవికులేశ
రాజసమొప్ప వి ♦ రాధుని గూల్చిన
రమ్యగుణాకర ♦ రాఘవేంద్ర
నినుమది నమ్మితి ♦ నీదయఁ జూపవే
దశరథవరపుత్ర ♦ తరణికులజ
తే. గీ. కరివరద దీన రక్షణ ♦ యురగరాజ
శయన సద్భక్తపోషక ♦ సన్నుతింతు॥ పుణ్యా 36

సీ. ధరణిలోపలనుండు ♦ ధర్మాత్ములైనట్టి
దాసజనులఁబ్రోచు ♦ తండ్రివనుచు
దుష్టులఁ బొలియించి ♦ శిష్టులరక్షించు
విశ్వమోహనుఁడవై ♦ వెలసి తనుచు
కమలాక్షననుగొల్వఁ ♦ గరుణింపకున్నావు
పాహియంటిని దయా ♦ పరుఁడ వనుచు
ముక్తిమార్గముఁజూపి ♦ మునులరక్షించిన
యమరేంద్ర వంద్య నా ♦ యన్నవనుచు
తే. గీ. నీదు పదసరోజములకు ♦ నాదుహృదయ
కమలమర్పించి పూజింతు ♦ ఖగవిహార॥...పుణ్యా37

సీ. చారు సుందరగాత్రి ♦ చాంపేయ గౌర వ
సన శరణు శరణు ♦ సదయ హృదయ
రఘురామ నీపాద ♦ రజముసోకి యహల్య
పతితపావనియయ్యె ♦ పరమపురుష
పద్మాలయముమాని ♦ పద్మ యెవ్వనిపాద
కమలంబుఁ బూజించెఁ ♦ గౌతుకమున
పరమమునీందు్రిలు ♦ భవ్యచిత్తములందు
నిలుపుదు రెవ్వాని ♦ నెవరుతోడ

తే. గీ. వట్టి నీరూపుఁ గనుగొన ♦ నాపుసట్టి
నన్ను ధన్యను జేయఁగా ♦ సన్నుతింతు॥ పుణ్యా 38

సీ. మిహిరకులోద్భవ ♦ మిముఁగోరివచ్చిన
దాని ముక్కుచెవులఁ ♦ దఱుగలేదె
పదియు నాలుగువేల ♦ బలురక్కసులఁబంప
దుష్టాత్ములనెల్లఁ ♦ దునుమలేదె
ఖరదూషణాదులఁ ♦ గదనరంగమునందు
ఖండించి పలుకీర్తిఁ ♦ గాంచలేదె
మాయామృగంబును ♦ మహిసుత వేఁడఁగా
దానిఁదెచ్చెద నంచుఁ ♦దరలలేదె

తే. గీ. క్రూర మృగమనియెంచియుఁ ♦ గూల్పలేదె
రామ భవ్యగుణోద్దామ ♦ రారవేగ॥... పుణ్యా 39

సీ. కామిత ప్రదశీల ♦ కరుణింపరావేల
కళ్యాణ గుణజాల ♦ గానలోల
నీలీలఁ గనఁజాల ♦ నిర్మలగుణశీల
పాలింపవేనన్ను ♦ పరమ పురుష
వామదేవ వసిష్ట ♦ వాల్మీకి శరభంగ
కణ్వాత్రి గౌతమ ♦ గార్గ్యపైల
జాబాలి జమదగ్ని ♦ శౌనకవాశిష్టు
లాదిమునులునెప్డు ♦ నమితభక్తిఁ।
తే. గీ. గొల్వ వేవేగరారమ్ము ♦ కోమలాంగ
భవ్యచారిత్ర సరసిజ ♦ పత్త్రనేత్ర॥ ...పుణ్య 40

సీ. రావణుం డనువాఁడు ♦ రమణినెత్తుకపోవ
దీనునికై వడిఁ ♦ దిరిగినావు
వసుధావరతనయ ♦ వ్వనులందు వెదకుచు
కూరుఁడైన కబంధుఁ ♦ గూల్చినావు
సీతజాడలు తెల్పి ♦ జీవములనువీడ
పులుఁగుజేనికిఁ ♦ గర్మసలిపినావు
కారుణ్యరసపూర ♦ ఖలుఁడనిదెలిసియుఁ
గాకాసురునివేగఁ ♦ గాచినావు
తే. గీ. అట్టి నీకృపవేఁడితి ♦ నాఁడుదాన
లోక బాంధవ లోకేశ ♦ లోకరక్ష॥ పుణ్య... 41

సీ. కణ్వాత్రిగాలవ ♦ గౌతమ దూర్వాస
ఘనమునీంద్రులుగొల్వ ♦ గరుణజూపు
రారశ్రీరఘువీర ♦ రాజితగుణశీల
రక్షింపవేనన్ను ♦ రమ్యచరిత
పన్నగాంతకవాహ ♦ భక్తమహోత్సాహ
నీరూపుఁ జూపవే ♦ నిర్మలాత్మ
నవపద్మదళనేత్ర ♦ భవబంధ మోచన
శాంతమూర్తిస్నాన ♦ పరమపురుష
తే గీ. శ్రీ రమామానినీ లోల ♦ శ్రితజనపరి
పాలనిర్జరవరగజాల ♦ భక్తపాల॥ . . . పుణ్య 42

సీ కనులార సేవించి ♦ కమ్మనిఫలముల
శ్రద్ధతోనిడినట్టి ♦ శబరిభాగ్య
మేమనివర్ణింతు ♦ నిందిరాప్రియనిన్ను
శ్రితజన పరిపాల ♦ శ్రీనివాస
తనువు పులకరింపఁ ♦ దవ పాదయుగళికి
మ్రొక్కి పూజింపఁగా ♦ మోక్షమిడిన
రామ సుగుణధామ ♦ రాజీవలోచన
రక్షింపరాగదే ♦ రమ్యచరిత॥
తే. గీ. నీదుమరుగు జేరితినయ్య ♦ నీలవర్ణ
జానకీమనోహరణ కాం ♦ చనవిభూష॥ . . . పుణ్య 43

సీ. వాలినివధియించి ♦ వానరరాజ్యము
రవిసూను కొసఁగిన ♦ రమ్యచరిత
నీసుధామధురమ్ము ♦ నింపువాక్కులవిన
గోరితి నామదిఁ ♦ గోమలాంగ
పరులము గాము నీ ♦ పాదసేవకులను
మఱచుటన్యాయమా ♦ మదనజనక
తరమె నిన్ వినుతింప ♦ ధాతకు మరివాని
తాతకైన మహాత్మ ♦ దనుజదమన

తే. గీ. సకలలోకాధిపతివీవు ♦ సదయహృదయ
నిన్ను మదినమ్మియుంటిని ♦ నీలవర్ణ॥ ... పుణ్య 44

సీ. కందర్ప జనకనీ ♦ సుందరవదనార
విందముఁ జూపు గో ♦ విందధీర
దివిజగణశరణ్య ♦ దితిసుతమదహార
ణచరణ కావవే ♦ సన్నురామ
శిష్టులరక్షింప ♦ దుష్టుల శిక్షింపఁ
గారుణ్యసాగర ♦ మేరుధీర
దీక్షపూనినయట్టి ♦ దివ్యపూరుషుఁడవు
కన్నడసేయకు ♦ గానలోల

తే. గీ. విమల గుణశీల జోహారు ♦ విశ్వరూప
సకల లోకనమస్కృత ♦ సత్యవచస॥ ...పుణ్య 45

సీ. వనచరులనుగూడి ♦ వననిధిలంఘించి
వైరులఁ బరిమార్చి ♦ వరలినావు
శరణని నీపాద ♦ సరసిజంబులఁజేర
ఘనమునీంద్రులనెల్లఁ ♦ గాచినావు
సర్వాపరాధముల్ ♦ క్షమియింపుమని వేఁడ
ఖలులనైనను బ్రేమఁ ♦ గాచినావు
పతితపావననామ ♦ గతినీవెయని వేఁడ
పుణ్యజనంబులఁ ♦ బ్రోచినావు.
తే. గీ. హరుని విలుద్రుంచి సీతఁజే ♦ పట్టినావు
జనులుమెచ్చంగరాజ్యంబు ♦ సలిపినావు॥ ...పుణ్య

సీ. జలచరరూపుఁడై ♦ జలధిలోపలఁజొచ్చి
బహుకష్టములఁబడ్డ ♦ బడలికలను
కూర్మావతారుఁడై కొండవీపునదాల్చి
బహుకష్టములఁ బడ్డ ♦ బడలికలను
యజ్ఞవరాహుఁడై యంబుధిలోఁజొచ్చి
బహుకష్టములఁబడ్డ ♦ బడలికలను
నరమృగరూపుఁడై ♦ కఱకురక్కసుఁద్రుంప
బహుకష్టములఁబడ్డ ♦ బడలికలను
తే. గీ. దీర నీసేవఁజేసెద ♦ ధీరచరిత
దివ్యమంగళ విగ్రహా దేవ దేవ॥ ...పుణ్య

47

సీ॥ వటుఁడవై బలిచక్రి ♦ వర్తిని పాతాళ
వాసుని జేసిన ♦ బడలికలను
ఇరువదియొకమారు ♦ నిలగలరాజులఁ
బరిమార్చినట్టి నీ ♦ బడలికలను
జనకు వాక్యముదీర్ప ♦ వనములదిరుగుచు
బలురక్కసులద్రుంచు ♦ బడలికలను
దనుజదమన వేగ ♦ దంతిరక్షార్థమై
బహుదూరమేగిన ♦ బడలికలను

తే. గీ. దీరఁబరిచర్యఁజేతు నీ ♦ దివ్యచరణ
సరసిజములకు భక్తితో ♦ సదయహృదయ. పుణ్య 48

సీ, సూర్య చంద్రులయందు ♦ శుద్ధసాధువులందు
సురలందు మునులందు ♦ సుజనులందు
సర్వభూతములందు ♦ సత్యశీలురయందు
కలువలువిలసిల్లు ♦ కొలకులందు
ధర్మపదవియందు ♦ దాసజనులయందు
గోవులందును విప్ర ♦ కోటులందు
కామధేనువులందు ♦ కల్పవృక్షమునందు
వలనొప్పు శృంగార ♦ వనములందు

తే. గీ. పూర్ణమైయున్న నీరూపు ♦ పొలుపుఁగాంతు
నీలవారిధర శ్యామ ♦ నిగమవినుత॥ పుణ్య 49

సీ. దివియందు భువియందు ♦ దిక్పాలకులయందు
దీనజనులయందు ♦ ధీరులందు
పగలురాత్రులయందు ♦ పంచవాయువులందు
పక్షులుపాడెడి ♦ పాటలందు
వృక్షవానరులందు ♦ యక్షకిన్నరులందు
మధురగానమునందు ♦ మనువులందు
మూఁడుమూర్తులయందు ♦ ముల్లోకములయందు

తే. గీ. ఋతువు లాదింటియందును ♦ ఋషులయందు
నిండియున్నట్టి శ్రీరామ ♦ నిర్మలాత్మ...పుణ్య 50

సీ. ఫణులందు మణులందు ♦ పర్వతాగ్రములందు
బాలురుపాడెడి ♦ పాటలందు
పుణ్యజనులయందుఁ ♦ బూవుఁదోఁటలయందుఁ
పంటభూములయందుఁ ♦ బక్షులందు
విష్ణుభక్తులయందు ♦ విబుధవరులయందు
సకలదిక్కులయందు ♦ సరసులందు
కరులందు గిరులందు ♦ కనకరాసులయందు
నదులందు నిధులందు ♦ నలమునందు

తే. గీ. నిండియున్న చిన్మయమూర్తి ♦ నీదుపాదములు
చూపవేవేగ రారమ్ము ♦ సుగుణశీల...పుణ్య 51

సీ. బ్రహ్మాండమెల్లను ♦ బంతిరీతిగఁజేసి
జగముల సృష్టించు ♦ జాణయెవఁడు
సకలచరాచర ♦ జంతుజాలములకు
ప్రాణిజీవంబును ♦ బోయునెవఁడు
కళ్యాణమూర్తియై ♦ కరుణార్ద్రహృదయుఁడై
సకలంబు నడిపించు ♦ సదయుఁడెవఁడు
నిఖిలపాపంబులు ♦ నిర్మూలనముఁజేసి
నిగమాంతవేద్యుఁడై ♦ నెగడెనెవఁడు
తే. గీ. జ్ఞానవైరాగ్యములకు ని ♦ దానమెవఁడు
అట్టి పరమేశునామది ♦ సభినుతింతు॥...పుణ్య 52

సీ. నీమంగళాంగంబు ♦ నిరతంబుమదినిలి
మోదంబుతోనీకు ♦ మ్రొక్కనిమ్ము
కన్నులశుక్రులతోఁ ♦ గలసిపోవకముందె
కనులారనీరూపుఁ ♦ గాంచనిమ్ము
కుతికెకు కఫమెక్కి ♦ గురకపుట్టకముందె
కనులార నీరూపుఁ ♦ గాంచనిమ్ము
కాళులుతడబడి ♦ కట్టఁబూనకముందె
సతతమ్ము నీసేవఁ ♦ సలుపనిమ్ము
తే. గీ. సకలలోకేశ నీపాద ♦ సరసిజముల
మదినిగోరి భజింతునే ♦ మదనజనక॥ పుణ్య ...53

సీ. జగములు సృష్టింప ♦ జగములు సమయింపఁ
బ్రభుఁడవు నీవెగా ♦ పద్మనయన
సత్కృపా సాగర ♦ సాధుసజ్జనప్రియ
సకలశాస్త్రధురీణ ♦ సత్యశీల
సర్వవేదాగమ ♦ సారయోగి వినుత
సరస సద్గుణబృంద ♦ సర్వజనక
పతితురాలను నేను ♦ పావనుండవు నీవు
పాలింపుననువేగ ♦ పద్మచరణ

తే. గీ. పరమకారుణికోత్తమ ♦ పరమపురుష
శరణు సర్వలోకాతీత ♦ శరణుశరణు॥ పుణ్యా... 54

సీ. జంతుసంతతినెల్ల ♦ సమదృష్టిఁజూచుచుఁ
బుట్టించి పోషించు ♦ పుణ్యుఁడెవ్వఁడు
సర్వకాలంబుల ♦ సకలజగంబుల
నరసిప్రోచుచునుండు ♦ నధిపుఁడెవఁడు
వేదాంత వేద్యుఁడై ♦ వెలసి యీభువిలోన
సాధుల రక్షించు ♦ సరసుఁడెవఁడు
పతితులనైనను ♦ పావనులను జేసి
నిరతంబుఁబ్రోచెడి ♦ నిపుణుఁడెవఁడు

తే. గీ. పరమభక్తులఁ బాలించు ♦ భవ్యుఁడెవ్వఁ
డట్టి పరమాత్మ నీరూపు ♦ నభినుతింతు॥ పుణ్యా 55

సీ. మునిజనసేవ్యుఁడై ♦ ముక్తిప్రధానుఁడై
ధర్మార్థచరితుఁడై ♦ దనరెనెవఁడు
సత్యస్వరూపుఁడై ♦ సజ్జనపూజ్యుఁడై
కరుణాస్వరూపుఁడై ♦ గ్రాలెనెవఁడు
కామారి సేవ్యుఁడై ♦ గజరాజవరదుఁడై
నిర్మలమూర్తియై ♦ నెగడెనెవఁడు
లావణ్యమూర్తియై ♦ లక్ష్మీనివాసుఁడై
భక్తులఁగాచెడి ♦ భవ్యుఁడెవ్వఁ
తే. గీ, డట్టి దేవదేవునిగొల్తు ♦ నధికభక్తి
భక్తలోకవరద హరి ♦ పరమపురుష॥ పుణ్య... 56

సీ. రాఘవ ననుగావ ♦ రాకున్న రవియాన
రక్షింపకున్న నీ ♦ రమణియాన
రాఘవననుగావ ♦ రాకున్న శశియాన
దయఁజూడకున్న నీ ♦ తనయులాన
రాఘవ ననుగావ ♦ రాకున్న దివియాన
జాగుజేసిన నీదు ♦ జననియాన
రాఘవ ననుగావ ♦ రాకున్న భువియాన
దరిఁ జూపకున్న నీ ♦ గురునియాన
తే. గీ, ఆనదప్పక పోషింపు ♦ మబ్జ నయన
మార శతకోటి సుకుమార ♦ మరువనేల॥ పుణ్య 57

సీ. కపికోటియెల్ల నీ ♦ కరుణచేతనెగదా
పట్టుపుట్టంబులు ♦ గట్టఁగలిగె
కపికోటయెల్ల నీ ♦ కరుణచేతనెగదా
వెలలేని మణిసరుల్ ♦ వేయఁగలిగె
కపికోటియెల్ల నీ ♦ కరుణచేతనెగదా
పునుఁగు జవ్వాదులఁ ♦ బూయఁగలిగె
కపికోటియెల్గ నీ ♦ కరుణచేతనెగదా
మేలోగిరంబుల ♦ మెక్కఁగలిగె

తే. గీ. నీకటాక్షంబునను గాదె ♦ నిండుకొజత
నీలధారాధరశ్యామ ♦ నీరజాక్ష॥ పుణ్య... 58

సీ. భక్తులు నీవెంటఁ ♦ బడివత్తురోయంచుఁ
బాలమున్నీటిపైఁ ♦ బండినావు
భక్తబృందము వెంటఁ ♦ బడివత్తురోయంచుఁ
బక్షీంద్రుపై నెక్కి ♦ పఱచినావు
భక్తులెల్లరు వెంటఁ ♦ బడివత్తురోయంచు
ఫణిరాజశయ్యపైఁ ♦ బండినావు
భక్తులునీవెంటఁ ♦ బడివత్తురోయంచు
మంచిమోధులఁగావు ♦ మంచినావు

తే. గీ॥ భక్తహృదయాంబురుహావాస ♦ భక్తజనులఁ
గావకుండుట న్యాయమా ♦ కమలనాభ. పుణ్య

సీ. కరుణఁజూడవునన్ను ♦ ఘనమునీంద్రులునీదు
పాదముల్ భక్తితోఁ ♦ బట్టికొనిరో
ఆదరింపవునన్ను ♦ హర సురేంద్రులు నీదు
పాదముల్ భక్తితోఁ ♦ బట్టుకొనిరో
నా మొరాలింపవు ♦ నలినసంభవుఁడు నీ
పాదముల్ భక్తితోఁ ♦ బట్టుకొనెనో
భక్తమందార నీ ♦ భక్తవరులు నీదు
పాదముల్ భక్తితోఁ ♦ బట్టుకొనిరో
తే. గీ. విడువరా ననుగావ ని ♦ న్వేదవేద్య
శరణ శ్రీజానకీనాథ ♦ శరణుశరణు॥ పుణ్య...60

సీ. పదియునాలుగువేల ♦ బలురక్కసులజంపి
ప్రఖ్యాతిఁగాంచిన ♦ ప్రభుఁడవీవె
ఖరదూషణాదుల ♦ ఖండించివైచిన
పద్మబాంధవ వంశ ♦ ప్రభుఁడవీవె
రావణ కుంభకర్ణముఖులఁ ♦ బరిమార్చి
ప్రఖ్యాతిఁగాంచిన ♦ ప్రభుఁడవీవె
పగవానితమ్మునిఁ ♦ బట్టభద్రునిజేసి
ప్రఖ్యాతిఁగాంచిన ♦ ప్రభుఁడవీవె
తే. గీ. తప్పుగలిగిన క్షమియించు ♦ తండ్రి వీవె
నీల నీరదగాత్రియో ♦ నిర్విచార॥ పుణ్య...61

సీ. రాజీవలోచన ♦ రమణీయమణిహార
రక్షింపవేనన్ను ♦ రాఘవేంద్ర

కోటిమన్మథరూప ♦ కోపమా నాపైని
కోరిభజించెద ♦ కోసలేంద్ర
సుగ్రీవనుతనామ ♦ సురముని సేవ్యయో
సూరిజనోద్ధార ♦ సుగుణసాంద్ర
మహిసుతారమణ నీ ♦ మహిమలెంచఁదరంబె
మార్తాండ సమతేజ ♦ మానవేంద్ర

తే. గీ. ప్రస్తుతింతునునీపాద ♦ పద్మములను
సురుచిరాకార సుకుమార ♦ సుజనవంద్య॥పుణ్యా...

సీ. నీకృపారసముచే ♦ నీరజభవునకు
నిఖిలంబుసృష్టించు ♦ నేర్పుగలిగె
నీకటాక్షముచేత ♦ నీరజ మిత్రుండు
ఘనకీర్తిసిలలోనఁ ♦ గాంచఁగలిగె
నీప్రభావంబుచే ♦ నెఱదాతయనఁగ నా
భర్గుండు ప్రఖ్యాతను ♦ బడయఁగలిగె
నీమహిమంబుచే ♦ నిర్మలగుణశీల
నిఖిలలోకంబులు ♦ నిలువఁగలిగె

తే. గీ. శరణుఁజొచ్చిన యవ్విభీ ♦ షణునిగావ
శ్రితజనావనుఁడవని ప్ర ♦ సిద్ధిగలిగె॥ పుణ్యా... 63

సీ. దనుజదమననీదు ♦ తమ్ముఁడు సౌమిత్రి
కోదండముఁదాల్చి ♦ కొలుచుచుండ
భవ్యగుణాకర ♦ భరతశత్రుఘ్నులు
వెలి చామరంబులు ♦ వీఁచుచుండ

మరకతమాణిక్య ♦ మణిహారముల్ దాల్చి
వామాంకమునసీత ♦ వరలుచుండ
మహనీయచారిత్ర ♦ మారుతి మీపాద
పద్మముల్ భక్తితోఁ ♦ బట్టుచుండ

**తే. గీ.** జలజనేత్రాలు పన్నీరు ♦ చల్లుచుండఁ
గొలువుఁదీరున్న నిన్గొల్తుఁ ♦ గువలయేశ॥ పుణ్యా..

**సీ.** ఆదివిష్ణువునీవె ♦ హరసురేంద్రులునీవె
యవనీతలమునీవె ♦ యగ్నినీవె
ధరణిరాజ్యమునీవె ♦ ధనసంపదలునీవె
తల్లిదండ్రులునీవె ♦ ధాత నీవె
వేదంబులునునీవె ♦ వేదాంగములునీవె
భూరుహములునీవె ♦ పుణ్యమునీవె
బ్రహ్మాండమునునీవె ♦ పలురూపములునీవె
సూర్యచంద్రులునీవె ♦ చుక్కనీవె

**తే. గీ.** ఇట్టి నిను సన్నుతింపఁగా ♦ నెంతదాన
నైన నినుమదినుతియింతు ♦ నంబుజాక్ష॥ పుణ్యా...

**సీ.** మణిమయహారాయ ♦ మహనీయరూపాయ
జానకీనాథాయ ♦ తేనమోస్తు
పల్లవ హస్తాయ ♦ భక్తైకవంద్యాయ
దానవహరణాయ ♦ తేనమోస్తు
పట్టాభిషిక్తాయ ♦ భవభయహరణాయ
దీనశరణ్యాయ ♦ తేనమోస్తు

శ్రీరమానిలయాయ ♦ లీలావతారాయ
మానిసంస్తుత్యాయ ♦ తేనమోస్తు
తే. గీ. సూన శరవైరి వంద్యాయ ♦ తేనమోస్తు
జనకభూపతి వినుతాయ ♦ తేనమోస్తు॥ పుణ్య 66

సీ. శ్రీరామచంద్రాయ ♦ శ్రితజనపాలాయ
త్రిదశసంస్తోత్రాయ ♦ తేనమోస్తు
కరిరాజవరదాయ ♦ కారుణ్యనిలయాయ
దేదీప్యమానాయ ♦ తేనమోస్తు
భానుసూను హితాయ ♦ భాస్కర తేజాయ
ధృతశంఖచక్రాయ ♦ తేనమోస్తు
రాజీవనేత్రాయ ♦ రాకేందు వదనాయ
దేవాది దేవాయ ♦ తేనమోస్తు

తే. గీ. దివ్యమంగళ రూపాయ ♦ తేనమోస్తు
దీనసంత్రాణ శీలాయ ♦ తేనమోస్తు॥ పుణ్య...67

సీ. కాంచనాంబరధార ♦ కన్నడ సేయక
కావవే రఘువీర ♦ కలుషదూర
కామారి నుతనామ ♦ కళ్యాణగుణధామ
కంజాత దళనేత్ర ♦ ఖగవిహార
శ్రితజనమందార ♦ శ్రీరఘుకులధీర
శ్రీరమణీమణీ ♦ చిత్తచోర
విమలాంబుదశ్యామ ♦ విశ్వమోహనరూప
మునిమనస్సంచార ♦ ముక్తిసార

తే. గీ. నిర్మలమణిహార శరణు ♦ నిర్వికార
నీరజాసనవందిత ♦ నీకుశరణు॥ పుణ్య... 68

సీ. ధవళాంబుజాతాక్ష ♦ దయజూపరాగదే
దశరథవరపుత్ర ♦ దనుజశిక్ష
జలధరోపమగాత్ర ♦ సప్తాశ్వశశినేత్ర
సుందరదరహాస ♦ సుజనరక్ష
భక్తసంతతినేలు ♦ భవ్యగుణాకర
భూమిసుతాధీశ ♦ భువనరక్ష
వాల్మీకి గౌతమ ♦ వామదేవవసిష్ట
శరభంగమునివంద్య ♦ శత్రుభంగ

తే. గీ. దక్షకన్యాధవస్తవ్య దయితభవ్య
నెమ్మి ననుగాచి నీపేరు♦నిలుపుకొనుము॥ పుణ్య...

సీ. కారుణ్యసాగర ♦ కౌస్తుభాభరణయో
భానుకులోద్భవ ♦ బహుపరాకు
దేవదేవోత్తమ ♦ దేవేంద్రవందిత
పరమాత్మరూపక ♦ బహుపరాకు
పరమదయాకర ♦ పలుమారు వేడితి
పరమపావనరామ ♦ బహుపరాకు
రమణీయమణిహార ♦ రఘుకులమందార
పన్నగేంద్రశయన ♦ బహుపరాకు

తే. గీ. పరమపురుషపరాత్పర ♦ బహుపరాకు
పవనసుతవంద్య సుకుమార ♦ బహుపరాకు॥ పుణ్య

సీ. నీకునమస్కృతుల్ ♦ నిరతంబుఁగావించు
వారిపుణ్యముచెప్ప ♦ వశముగాదు
నీసత్కథాసుధ ♦ నిరతంబుఁగ్రోలెడి
వారిపుణ్యముచెప్ప ♦ వశముగాదు
నీనామకీర్తనల్ ♦ నిరతమాకర్ణించు
వారిపుణ్యముచెప్ప ♦ వశముగాదు
నీసేవ లనయంబు ♦ నిశ్చలంబుగఁజేయు
వారిపుణ్యముచెప్ప ♦ వశముగాదు

తే. గీ. నీదుపదభక్తితప్ప యిం ♦ కేదియెఱుఁగ
నీలనీలోత్పలోపమ ♦ నేత్రయుగళ॥ పుణ్యా... 71

సీ. లలితకోమలగాత్ర ♦ లావణ్యగుణపాత్ర
సురమునిపరివేష ♦ సుజనపోష
సుందరమణిహార ♦ సురనాథవందిత
సుకుమారరఘువీర ♦ సుప్రభావ
గరుడరాజతురంగ ♦ కరుణాంతరంగయో
పతితపావననామ ♦ పరమపురుష
పుండరీకాక్షమా ♦ ర్తాండపుత్రావన
వేదాంతపరిభాష ♦ వినుతవేష

తే. గీ. భక్తసంతతిఁబ్రోచెడి ♦ వర దయాత్మ
పతితపావన బిరుదాంక ♦ పద్మనాభ॥ పుణ్యా...72

సీ. మల్లెలు మొల్లలు ♦ మరువంబు కేతకీ
పున్నాగచంపక ♦ పుష్పతతులు

చెంగల్వ చాంపేయ ♦ సెంటుజాజీబంతి
కమనీయమైనట్టి ♦ కమ్మవిరులు
రమణీయమైనట్టి ♦ రంగురంగు గులాబి
సన్నజాజులు పారి ♦ జాతివిరులు
కరవీరమాధవీ ♦ కమలోత్పలంబులు
బొండుమల్లెలుమంచి ♦ పొన్నవిరులు

తే. గీ. దెచ్చిపూజింతు దేవాది ♦ దేవదేవ
సకలపండిత జననుత ♦ సదయహృదయ॥ పుణ్య...

సీ. భువనంబు లలరించు ♦ భువనమోహనరూప
శ్రీకరచరణముల్ ♦ చిత్తమందు
సద్భక్తిఁ బూజింతు ♦ సాగరకన్యకా
చిత్తపంకజచోర ♦ చిద్విలాస
నిరతము నీపద ♦ నీరజములగాంచ
మదికాంక్షపుట్టెడి ♦ మదనజనక
నీవెదైవమటంచు ♦ నెరనమ్మియున్నాను
నిరుపమ గంభీర ♦ నిర్వికార

తే. గీ. దేవదేవ జగన్నాథ ♦ దీనబంధు
భక్తవత్సలననుగావ ♦ భారమయ్య॥ పుణ్య... 74

సీ. నిశ్చలభక్తితో ♦ నిన్నుఁబూజింపఁగ
నీదయరాదాయె ♦ నీరజాక్ష
నీసన్నిధినిజేరి ♦ నిన్నునామదిఁగోరి
యేప్రొద్దుసేవింప ♦ నెంచవేమి

నిర్మలమణిహార ♦ నిరుపమగంభీర
నిఖిలలోకాధార ♦ నిర్వికార
నీకృపకై వేచి ♦ నీదు సేవలఁజేయ
నీయండఁజేర్పవా ♦ నీలవర్ణ

తే. గీ. సకల లోకోపకారివి ♦ సదయ హృదయ
కోరిభజియింతు నన్నుఁజే ♦ కొనఁగరావె॥ పుణ్య...

సీ. నీనామమహిమచే ♦ నిఖిలపాపంబులు
నిర్మూలమైపోవె ♦ నిర్మలాత్మ
నీకటాక్షమెకోరి ♦ నిన్నె మదినినమ్మి
నిరతముపూజింతు ♦ నిగమవినుత
నీదరిఁ జేరితి ♦ నిన్నాశ్రయించితి
నిఖిలలోకావన ♦ నీలవర్ణ
నీదయఁజూపవే ♦ నిరుపమమణిహార
నిన్ను వర్ణింపఁగ ♦ నేరనయ్య

తే. గీ. పతితపావననామ నీ ♦ పాదభక్తి
నొసఁగి కాపాడవేనన్ను ♦ నురగశయన॥ పుణ్య...

సీ. నీలోత్పలశ్యామ ♦ నిన్నె నమ్మితిరామ
తారకనామ కో ♦ దండరామ
కమనీయకాంచన ♦ కౌస్తుభమణిహార
కావవేవేగ శృం ♦ గార రామ
వనరుహదళనేత్ర ♦ వనజసంభవనుత
లావణ్యసీమ క ♦ ళ్యాణరామ

సుమశరశతకోటి ♦ సుందరాకారయో
సూరిజనానంద ♦ సుగుణధామ

తే. గీ. రామజయరామ రణరంగ ♦ భీమనిన్నె
మదిని నమ్మితి రఘువీర ♦ మరువఁదగదు॥ పుణ్య77

సీ. అరవింద దళనేత్ర ♦ యమరసన్నుతపాద
యోగులుధ్యానించు ♦ యోగమెఱుఁగ
భవబంధమోచన ♦ భక్తజనావన
భక్తులుపాడెడి ♦ పాటలెఱుఁగ
మూఁడుమూర్తులునీవె ♦ మునిమనస్సంచార
మునివరుల్ ధ్యానించు ♦ మూలమెఱుఁగ
సాధుజనులఁబ్రోచు ♦ సత్స్వరూపక
సాధులుపూజించు ♦ సరళియెఱుఁగ

తే. గీ. పరమపూరుష నీపాద ♦ భక్తియెఱుఁగ
తనివిఁ దీరంగనిన్ను నే ♦ దలఁచియెఱుఁగ॥ పుణ్య78

సీ. దుష్టుల శిక్షించి ♦ శిష్టుల రక్షించి
ధర్మంబు నిలిపెడి ♦ తండ్రివీవె
తండ్రులమఱపించి ♦ తండ్రిగాదయఁజూపి
ధరణిజనులఁబ్రోచు ♦ తండ్రివీవె
భవ్యగుణాకర ♦ భవబంధములఁబాపి
భక్తతతిని బ్రోచు ♦ భ్రాతవీవె
నీరజభవునకు ♦ నిఖిలంబు సృష్టించు
నేర్పుఁదెలిపినట్టి ♦ నేతవీవె

తే. గీ. గాన నీదరిఁ జేరితి ♦ గరుడగమన
నన్నుగావంగ భారమా ♦ నళిననేత్ర॥ పుణ్య ..79

సీ. నీభక్తులనుగూడి ♦ నీదుముచ్చటలాడి
నీకీర్తనల్ బాడి ♦ నెమ్మితోడ
నీపాదములఁబట్టి ♦ నిన్నెగతిగనెంచి
నిరతంబుసేవింతు ♦ నిష్కళంక
నిఖిలలోకారాధ్య ♦ నిర్మలభక్తితో
నీమహిమనుతింప ♦ నేరనయ్య
నీదుతనయుపైని ♦ నీకింతకోపమా
నీరజదళనేత్ర ♦ నిర్మలాత్మ

తే. గీ. పంక్తిరథరాజ సుకుమార ♦ పాపహరణ
భక్తమందారనినుగొల్తుఁ ♦ బరమపురుష॥పుణ్య...

సీ. నీకీర్తి చంద్రికల్ ♦ నిరతంబువర్ణింప
నలపద్మజుండనే ♦ నళిననేత్ర
నీమీఁదికీర్తనల్ ♦ నిత్యగానముసేయ
నలనారదుండనే ♦ యనఘచరిత
నీధైర్యశౌర్యముల్ ♦ నిరతంబువినుతింప
నమరనాథుండనే ♦ యబ్జనాభ
నీనామ మాధురిఁ ♦ నిరతంబుఁగ్రోలఁగా
నల యుమాధవుఁడనే ♦ యమరవంద్య

తే. గీ. నాదునేరములన్నుసైప ♦ నీదుభవ్య
పాదపద్మముల భజింతుఁ ♦ బరమపురుష॥పుణ్య...

సీ. పుండరీకాక్ష నీ ♦ యండఁ జేరితి వేగ
కాపాడుమా నన్ను ♦ గలుషహారణ
సీతామతల్లికై ♦ సేతుబంధనఁ జేసి
దశకంఠుఁ ద్రుంచిన ♦ దశరథసుత
శ్రీరామభూపాల ♦ శ్రితజనపరిపాల
పతితపావననామ ♦ పద్మచరణ
శరణాగతత్రాణ ♦ సత్కవిజననుత
నీ ప్రాపుఁ గోరితి ♦ నిర్మలాత్మ
తే. గీ. తరుణి నన్ వేగఁ గావఁగాఁ ♦ దరలిరావె
జలజబాణుని గన్నట్టి ♦ జగదధీశ॥ పుణ్య... 82

సీ. అంబుజదళనేత్ర ♦ యమరవందితపాద
విడువకని మది ♦ వేఁడుచుంటి
నిర్మలమతితోడ ♦ నీపదాబ్జముల నా
చిత్తమందునఁ ♦ బూజసేయుచుంటి
నన్ను వీడఁగ నానే ♦ నగరాజసమధీర
యమలగుణాఢ్య నీ ♦ న్నాప్తుఁడంటి
శ్రీరాఘవేంద్రయా ♦ శ్రితజనపరిపాల
యభయమీయను నీవె ♦ ప్రభుఁడవంటి
తే. గీ మదనమోహనరూపని ♦ మరువనంటి
దైత్యసంహార నీవె నా ♦ దైవమంటి॥ పుణ్య ...83

సీ. మోక్షదాతవటంచు ♦ మ్రొక్కుచుంటిని నేను
మోహమైనఁజూపవు ♦ మోహనాంగ
నీయాజ్ఞఁదప్పక ♦ నీయందు భక్తిచే
నేసాద్ధుఁ జరియింతు ♦ నిద్ధచరిత
సదయుఁడవగునిను ♦ సతతమునమ్మితి
సరగునఁ బ్రోవవే ♦ సదయహృదయ
నవరత్నమణిహార ♦ నగరాజసమధీర
కాంచనాంబరధర ♦ కనులనయన
తే. గీ. నన్నుగరుణింపవే రమా ♦ నాథ నీదు
పాదములనమ్మియున్నాను ♦ పరమపురుష॥ పుణ్య

సీ. నీనామమేనాకు ♦ నిష్కళంకపువిద్య
నీలాంబుదశ్యామ ♦ నీదుదయను
జూపవే శ్రీరామ ♦ సుగుణగుణోద్దామ
రణరంగభీమ శ్రీ ♦ రామనామ
రక్షింపనీకన్న ♦ రక్షకులెవరయ్యా
రాజేంద్ర దినరాజ ♦ రాజనేత్ర
ధ్రువుని భక్తికిమెచ్చి ♦ ధ్రువపదంబొసఁగిన
దేవదేవోత్తమ ♦ దిక్కునీవె
తే. గీ. నవ్యమాణిక్యమయ విమా ♦ నంబుపైని
జనక సుతఁగూడి విహరించు ♦ జలజనాభ॥ పుణ్య..

నీదివ్యనామంబు ♦ నిరతంబు జపియింప
ఘోరపాపంబులఁ ♦ గొట్టివైచు
నీపాదపద్మముల్ ♦ నిరతంబు సేవింప
ఘోరపాపంబులఁ ♦ గొట్టివైచు
నీదివ్యకథలను ♦ నిరతమాకర్ణింప
ఘోరపాపంబులఁ ♦ గొట్టివైచు
నీనామకీర్తనల్ ♦ నెమ్మితోఁ బాడిన
ఘోరపాపంబులఁ ♦ గొట్టివైచు

తే. గీ. గాన నినుమదిధ్యానింతు ♦ గరుడగమన
పతితపావన బిరుదాంక ♦ పరమపురుష॥ పుణ్య...

సీ. తరణికులేశ నీ ♦ చరణసేవకులను
మఱచుటన్యాయమా ♦ మధురవచన
వనజదళాక్షనీ ♦ వదనారవిందము
జూపఁగాఁగోరితి ♦ సొంపుమీఱ
హరిహరియంచును ♦ కరిరాజు మొరలిడ
కరుణనుగాచిన ♦ ఘనుఁడవీవె
సర్వలోక శరణ్య ♦ సర్వజనకనీదు
సన్నిధిఁ జేరితి ♦ సరళహృదయ

తే. గీ. నన్నుగావభారమె శ్రితా ♦ పన్నివార
నీలమేఘశరీర యో ♦ నిర్వికార॥ పుణ్య... 87

సీ॥ భక్తజనావన ♦ పద్మపీఠిని నీవు
పుడమితనయతోడఁ ♦ బొందుగాను
నివసించియుందువు ♦ నిఖిలలోకాధిప
నీప్రియతనయను ♦ నెమ్మితోడ
నిరుపమకారుణ్య ♦ నెరదాతవనుచునే
నినునమ్మియుంటిని ♦ నిండుమదిని
లాలితరఘువీర ♦ లావణ్యగుణశీల
రక్షింపవేనన్ను ♦ రమ్యచరిత

తే. గీ. ప్రణుత వత్సలవనజాక్ష ♦ పరమపురుష
దొడ్డరాజవు నీప్రాపు ♦ దొరకెనాకు॥ పుణ్య.

సీ. దీనులరక్షింప ♦ దిక్కునీవైయుండ
దీనతనాకేల ♦ దివ్యపురుష
పదునాల్గుభువనముల్ ♦ పాలింపుచుందువు
పదమప్రీతినినీవు ♦ పద్మనయన
నాపాలిదైవమా ♦ నాపైనికోపమా
యకట నేభారమా ♦ యమరవినుత
వెలిదమ్మితేకుల ♦ గెలుచునీకనుగవ
విప్పినన్ జూడవే ♦ విమలతేజ

తే. గీ. పతితపావననామ శ ♦ బరియిడిన ఫ
లముల నారగించినదేవ ♦ లలితచరిత. పుణ్య.

సీ. రాజీవదళనేత్ర ♦ రాజేంద్రరాఘవ
రమణీయరత్నాంబ ♦ రంబుఁదొడిగి
రత్నాకరునిపట్టి ♦ రమణిశ్రీజానకి
చెంతనుండఁగవచ్చి ♦ చింతఁదీర్చి
రక్షింపుమానన్ను ♦ రామచంద్ర నరేంద్ర
నాకన్యథాశర ♦ ణంబునాస్తి
రమణీయరూప నీ ♦ రమ్యపదాబ్జముల్
నిరతము పూజింతు ♦ నిర్మలాత్మ
తే. గీ. ఖరవిరాధులమర్దించిన ♦ కమలచరణ
భవ్యచారిత్ర రఘువీర ♦ భవవిదూర. పుణ్య...

సీ, నీభక్తులనుగూడి ♦ నీకీర్తనల్ పాడఁ
జిత్తమొల్లద దేమి ♦ చిత్రమయ్య
నిశ్చలభక్తితో ♦ నిన్ను బూజింపఁగాఁ
జిత్తమొల్లద దేమి ♦ చిత్రమయ్య
భక్తితోడుతనిన్ను ♦ బ్రార్థింపనెంచిన
చిత్తమొల్ల ద దేమి ♦ చిత్రమయ్య
భక్తితోనీపాద ♦ భజనసేసెదనంటె
చిత్తమొల్ల ద దేమి ♦ చిత్రమయ్య
తే. గీ. నిర్మలానందరూపయో ♦ నీరజాక్ష
కరుణచూపిన గావవే ♦ గరుడగమన। పుణ్య...

సీ. అమరకాంతలఁబోలు ƒ నలినీలవేణులు
రత్నభూషితచామ ƒ రములువీవ
శ్రీసతితోనీవు ƒ శ్రీమీాఱనిటవచ్చి
సాక్షాత్కరింపుమా ƒ సదయహృదయ
మేరుమందరధీర ƒ మేదినీరమణ నీ
పాదారవిందముల్ ƒ పారిజాత
సుమములఁబూజింతు ƒ విమలాంబుదశ్యామ
పతితపావననామ ƒ పరమపురుష
తే. గీ. సచ్చిదానందరూపయో ƒ సత్యశీల
దీనురాలను నామొరఁ ƒ దీర్పుమయ్య! పుణ్య...

సీ. ఈవసుధనునీవు ƒ గావకుండిననన్ను
గాచువారెవరయ్య ƒ గరుడగమన
నీదయరాకున్న ƒ నిజముగానాకింక
దిక్కెవ్వరయ్యయో ƒ దివ్యపురుష
దురితములనుజేసి ƒ దోషాగ్నిలోపల
ద్రెళ్ళుచుంటిఁగదయ్య ƒ దేవదేవ
కామితంబులొసంగు ƒ కర్తనీవనుచు నీ
భవ్యపదాబ్జముల్ ƒ బట్టినాను
తే. గీ. దివ్యపరిమళసుమములు ƒ దెచ్చిపూజఁ
జేతు శ్రీజానకీనాథ ƒ చిత్తములర! పుణ్య... 93

సీ. నీనామ మేప్రొద్దు ♦ నిష్ఠతో జపియింప
నలయుమాకాంతనే ♦ యబ్జవదన
నీమీఁదిపద్యముల్ ♦ నిరతంబుఁ బాడఁగాఁ
భారతీదేవినే ♦ పద్మచరణ
నిర్మలమతితోడ ♦ నిన్ బూజసేయఁగా
గౌతమకాంతనే ♦ గరుడగమన
శ్రద్ధతోఫలముల ♦ సద్భక్తిఁదెచ్చి నీ
కనియింప శబరినే ♦ ధర్మహృదయ

తే. గీ. కానుకాను ముమ్మాటికిఁ ♦ గమలనయన
ఎటులఁగాచిరక్షించెదో ♦ నింక నన్ను!! పుణ్యా 94

సీ. నీతోడు నీడనై ♦ నినుగొల్చుచుంటకు
సౌమిత్రియనుగాను ♦ సరళహృదయ
సందిగ్ధసమయాన ♦ సాహాయ్యపడుటకు
వినతనయుఁడగాను ♦ నిందిరేశ
వెలలేని మణిసరు ♦ లెలమినీకియ్యంగ
సాగరుఁడనుగాను ♦ సారసాక్ష
చిన్నారిపొన్నారి ♦ సీతనునీకీయ
జనకరాజునుగాను ♦ జలధిశయన

తే. గీ. భక్తిధనమొండె నాకున్న ♦ శక్తిగాన
కరుణఁజూడుము నన్నీవ ♦ కమలనయన॥పుణ్యా 95

సీ. సతతంబు నీనామ \ స్మరణఁ జేయనివారి
చదువులు వేయేల \ జన్మమేల
భక్తితో నీపాద \ భజన సేయనివారి
దానధర్మములేల \ ధనమదేల
పుణ్యచరితనీదు \ పూజ సేయనివారి
యోగధారణమేల \ యుక్తులేల
నీకథామృతమును \ నెమ్మిఁ గ్రోలనివారి
నీతులయ్యావియేల \ నిష్ఠయేల

తే. గీ. ధీరచరిత నీదుమహిమ \ దెలియ నేరి
తరము నీదాసురాలిపై \ దయనుజూపు॥ పుణ్య 96.

సీ. కాయ మస్థిరమని \ కలనైన నెఱుఁగక
మోసపోయితినయ్య \ మోక్షరూప
రక్షింతువో మఱి \ శిక్షింతువో మఱి
రాజాధిరాజ శ్రీ \ రామభద్ర
నిన్ను ప్రేమించెడి \ నీపదభక్తుల
గాసిపెట్టెద వేల \ కమలనాభ
ఘోరపాపభయంబుఁ \ గొట్టివై చెదవని
గట్టిగా నిన్ను చేపట్టియుంటి

తే. గీ. గరుడ గంధర్వ కిన్నర \ గణముగొలువ
వచ్చి నన్ గావవే వేగ \ వసుమతీశ॥ పుణ్య...97

సీ. ఎచ్చోటఁజూచిన ౯ నచ్చోటగనుపింతు
వనినమ్మియుంటిని ౯ వనజనయన
యలవిభీషణుఁడు ము ౯ న్నఖిలసామ్రాజ్యంబు
చేకొంట నీశక్తి ౯ చేతఁగాదె
యట్టినీ భక్తిచే ౯ నభినుతింపఁగలేదె
కరుణనన్ గావవే ౯ కమలచరణ
కువలయనయననీ ౯ గుణకీర్తనంబులు
వర్ణింపనలవియే ౯ వనజభవుని
తే. గీ. కైన ఫణిసార్వభౌముని ♦ కైన హర సు
రేంద్రులకునైన తరమ స ౯ ర్వేశ్వరహరి॥ పుణ్య 98

సీ. నామొర వినవయ్య ౯ నాపైనఁబంతమ్ము
విడుమయ్య ననుగావ ౯ వేఁడితయ్య
భక్తచిత్తనివాస ౯ భవ్యగుణాకర
జానకీ హృదయేశ ౯ జలజనాభ
నీదుసంకీర్తనల్ ౯ నిరతంబువినుచుండు
వీనులేవీనులు ౯ విమలచరిత
ఆర్తజనశరణ్య ౯ యాదరింపఁగరార
యరవిందదళనేత్ర ౯ యమరవంద్య
తే. గీ నన్ను బ్రోవఁగరావేమి ౯ నన్ను తాంగ
నిరుప మాకార సుకుమార ౯ నిగమవినుత। పుణ్య 99

సీ. అంభోజదళనేత్ర ✿ జంభారిసేవిత
పాద పరాత్పర ✿ పరమపురుష
చూచి చూడనియట్లు ✿ చూచుచుండెద వేల
సూరిజనోద్ధార ✿ సుగుణశీల
కరుణింపవే నన్ను ✿ కమలామనోహర
కరుణింపఁదగునే ✿ ఘనతనీకు
పరమచరితనీదు ✿ పదపద్మములఁజూపి
రక్షింపవేనన్ను ♦ రామభద్ర
తే. గీ. యక్షకిన్నర కింపురు ✿ షాదియమర
వరులు గొలువఁగ విలసిల్లు ✿ వసుమతీశ॥ పుణ్య100

సీ. సరసహృదయనీదు ✿ చరణాబ్జములునమ్మి
సేవలెల్లప్పుడుఁ ✿ జేయుచుందు
నవరత్నఖచిత క ✿ నకహార పంక్తులు
ధరియించి మెఱయు సౌం ✿ దర్యమూర్తి
కౌస్తుభాలంకార ✿ కామితమందార
కరుణింపవే వేగ ✿ కన్నతండ్రి
భక్తసంతతినేలు ✿ భవ్యగుణాకర
మన్నింపవేనన్ను ✿ మదనజనక
తే. గీ. కలుషసంహార కావుమూ ✿ గరుడగమన
సర్వమంగళ దాయక ✿ సదయహృదయ॥పుణ్య101

సీ. మహనీయమాణిక్య $ మకుటాంక శతకోటి
మన్మథాకారనిను $ మరువగలనె
లావణ్యమృదుభాష $ లాలితదరహాస
వేదాంత వేద్య నిను ♦ విడువఁగలనె
ఆపదోద్ధారక $ యాశ్రిత జనరక్ష
నీకృపలేకున్న $ నిలువఁగలనె
కామిత ప్రదశీల $ కంజాతపత్రాక్ష
భక్తను గనకున్నఁ $ బ్రతుకఁగలనె
తే. గీ. నిన్నువర్ణింప దరమౌనె $ నిర్మలాత్మ
సర్వలోక నమస్కృత $ సార్వభౌమ॥ పుణ్య 102

సీ. కౌసల్యముద్దిడు $ గారాబుపదములఁ
కరుణను జూపవే $ గానలోల
రాతినాతిగఁజేయు $ రమణీయ పదములఁ
గరుణను జూపవే $ కమలనాభ
పశుపతి సతతము $ భజియించుపదములఁ
గరుణను జూపవే $ కలుషహరణ
పవనాత్మజుఁడు భక్తి ♦ వలగొనుపదములఁ
కరుణను జూపవే $ కమలనయన
తే. గీ. భక్తకోటుల నేలెడి $ భవ్యచరిత
పతితపావన బిరుదాంక ♦ పంతమేల॥ పుణ్య...103

సీ. మహనీయ కాంచన ƒ మణిహారములఁదాల్చి
భరత సౌమిత్రులు ƒ ప్రక్కనుండ
నవరత్న ఖచితమై ƒ యలరారుచుండెడి
సింహాసనంబున ƒ సీతతోడ
వేంచేసియున్నట్టి ƒ వేదాంతవేద్యయో
యమరేంద్ర వందిత ƒ యనఘచరిత
కడుభక్తితో నినుఁ ƒ గరుణింపుమని వేఁడఁ
గావఁగారావేమి ƒ కమలచరణ

తే. గీ. దనుజహరణ శుభచరణ ƒ దయనుజూపి
వేగకావవే శ్రీరామ ƒ విమలతేజ॥ పుణ....104

సీ. దీనులఁబ్రోవఁగా ƒ దీక్షయున్నదినీకు
దీనురాలను నేను ƒ దివ్యపురుష
దండిదొరవునీవు ƒ దానవాంతకమేరు
గంభీర రఘువీర ƒ కలుషహరణ
ధాత్రిలో నీకన్న ƒ దాతలెవ్వరులేరు
దయయుంచి కావవే ƒ దైవమీవె
దశరథవరపుత్ర ƒ దాసులమొరవిని
దర్శనమొసఁగెడు ƒ ధర్మవర్తి

తే. గీ. నీల నీలాంబుదశ్యామ ƒ నీరజాక్ష
కోటిసూర్యసమప్రకాశ ƒ కోపమేల॥ పుణ్య. 105

సీ. శారదాధీశుని ౯ సద్భక్తి నుతియించి
భారతీదేవిని ♦ బ్రస్తుతించి
భావజవైరిని ౯ భక్తితో ధ్యానించి
పర్వతరాడ్పుత్రిఁ ౯ బ్రస్తుతించి
శ్రీరమానాథుని ౯ చిత్తమందుననిల్పి
పాలకడలిపట్టిఁ ౯ బ్రస్తుతించి
శ్రీగణాధీశుని ౯ చిత్తమందుఁదలఁచి
పవమానతనయునిఁ ౯ బ్రస్తుతించి

తే. గీ. పరమభాగవతుల నెల్లఁ ౯ బ్రస్తుతించి
నిన్నెశరణంబు వేఁడితి ౯ నీలవర్ణ॥ పుణ్య... 106

సీ. శ్రీరామనామ సు ౯ ధారసంబును గ్రోలి
సరస మృదు కవిత్వ ౯ సరణిఁదెల్పి
నట్టివాల్మీకిని ౯ నతిభక్తిఁగొనియాడి
బాణమయూరులఁ ౯ బ్రస్తుతించి
వ్యాసుని విద్యా వి ౯ లాసుని నిర్మల
కవితామనోల్లాసు ౯ ఘనతఁబొగడి
శివభద్రు సోమిల్లి ౯ శ్రీనాథ బిల్హణ
మల్హణ పోతనా ౯ మాత్యుఁదలఁచి

తే. గీ. రామ రాజ భూషణకవి ౯ రాజుఁదలఁచి
ప్రథితవాక్ప్రౌఢికై యొప్పఁ ౯ బ్రస్తుతింతు॥ పుణ్య.

సీ. వికసితాంబుజనేత్ర • విశ్వమోహనగాత్ర
సత్పుణ్యచారిత్ర • సత్యశీల
కంజాతహితవంశ • కలశాంబునిధిచంద్ర
గీర్వాణవందిత • గిరిజ వినుత
నీకృపారసముచే • నేర్చిచేసినయట్టి
శతసీసపద్యంపుఁ • బతకమిదిగో
కారుణ్యరసపూర • కరుణతోఁ గైకొని
రక్షింపవే వేగ • దీక్షతోడ

తే. గీ. భవ్యకాంచన మణిహార • పరమపురుష
భక్తవరదుఁడ వైనట్టి • పార్థివేంద్ర
పుణ్యగుణధామ రవికులాంభోధిసోమ
రమ్యకరుణాతిసాంద్ర శ్రీ • రామచంద్ర॥ 108

---

ప్రభాత ముద్రణాలయం, నెల్లూరు.